చ్చనియప్పుబాధ। చెలగి చేతులముంత త్రిపఱుబడిపోవ చెప్పనగొట్టించె నప్పుబాధ। గొప్పయింటనుబుట్టి మెప్పుగాబ్రదికిన తిప్పలుబెట్టించునప్పుబాధ। తలిదండ్రిలాదిగ దగినబంధువులెల్ల తప్పులెంచఁగఁజేయు నప్పుబాధ। మురిపెంపుబిడ్డలు మప్పుదీర్పదమన్న తెప్పునఁజెడగొట్టు నప్పుబాధ। హరిహరబ్రహ్మాదు లాఁకలిగొనిరాగ నన్నంబు వెట్టనీదప్పుబాధ। అప్పుబాధను భరియింప హరునితరమ। గొప్పకోరింతపాదగాదె కొమరుమిగులు। అన్నమనితిన పెద్దలీయవనిలోను। సున్నమగు నప్పుబాధచే నెన్నిచూడ.

క. ఏకరణినప్పులేమియు। నాకలియని యడుగకున్న నంబుజనాభా। చేకొని సకలవ్యాధులు। ప్రాకటమునునం తకంటె ప్రబలంబా యొకో.

సీ. నా సేమాసంగతుల్ నయముగాఁ దెల్పఁగ నాటకంబులుగదా సూటియగును। నాటకంబెట్టిదో నాతెంతెలుంగక బూటకంబందురు భువినిజనులు। తనవారును దర్పణంబున జూడనయ్యెడు మనువునుదగు నీతి మానవు

శ్రీ

# ముక్తి మార్గోప[illegible]




ఇయ్యది

చివుకుల మహాలక్ష్మిచే ర[illegible]బడె

దొడ్డమపేట జమీందారిణివారగు

శ్రీ వాడరేవు రంగనాయకమ్మగారి

ద్రవ్య సహాయమున

ఏలూరు

రామమోహన ముద్రాక్షరశాలయందు

ముద్రించి ప్రకటింపఁబడియె.

1 వ కూర్పు 500 ప్రతులు.

1914.

  (దీని వెల 0.1-0.

రాగ్యములు మాకు పదిలముగను। ఈయవలెనీవు మాకి
ప్పుడేకదంత.

దరువు—ఏల.

గణపతి నిన్నే నే కలలోనుమరువాను విఘ్నరాయా।
కనికరముగ నన్ను కరుణించ వలెనయ్యా విఘ్నరాయా।
పొద్దుపొద్దునే నే నిద్దురలేతును విఘ్నరాయా। ఆధా
రమునినిన్ను అనుసరించితి నయ్యా విఘ్నరాయా। హంస
స్వరూపివై యానందమునుబొందు విఘ్నరాయా.

గురుస్తోత్రము.

క. గురువే బ్రహ్మగ విష్ణుగ। గురువె పరబ్రహ్మ మను
చు గురుతుగమదిలో। గురువేసర్వాతీతుఁడు। గురు వే గు
ణరహితపరుఁడు గుణవంతులకున్.

గీ సిరియు సంపదవిలసిల్లు సృష్టిలోన। చివురుల కు
లాబ్ధినుదయించె జిత్తమలర। భారద్వాజసగోత్రమునఁ
బ్రబలుచుండె! రామకృష్ణయ నామమిడెరమ్యముగను.

గీ. ఆమహాత్మునినామంబువనిలోన। సుక్తిముక్తులు
లిగగించు సూక్ష్మముగను। భక్తివైరాగ్యజ్ఞానము ల్వడ

యుటకును। అతనిసతియును విలసిల్లె నవనిలోన.

సీ. నిర్వికల్పసమాధి నిరతిమేలొ్క నినంత నిత్య కర్మ
క్రియల్ దీర్చుచుండు। గంగయమునల మధ్యపొంగుచుం
డినయంత సంగంబునను జలకమాడుచుండు। బూదినిం
డుగబూసి భ్రూమధ్యస్థలంబున హోమదానక్రియల నొనఁ
గుచుండు। అవభృథస్నానంబు లాచరించిన వెన్క నాది
త్యధ్యానంబు నమరియుండు। చెలఁగి సంసారమును చె
వినంటకున్నల్లు జపతపంబులమనసు జేయుచుండు। వేద
వేదాంతశాస్త్రము ల్వ్రాలయుచుండు। అతిథినభ్యాగతిని వే
డ్క నాదరించు। నిట్టిదంపతు లిలలోనఁ బుట్టఁబోరు।పు
డమిలోపల మనమింక బొగడఁదరమ

సీ సోదరీమణులార! చోద్యంబుగా మనము నత్క
థా శ్రవణంబు సలుపవలెను। కేశవనామంబు వాసిగాఁ
దలఁచుచు దాసులమైదరి దరియవలయు। నరజన్మమెత్తి
యు నారాయణునకన్న నరుని జూడఁగరాదు ధరణియం
దు। మాధవధ్యానాభి మగ్నత నొందిన మానవుం డేపాపి
ము మరువరాదు। కలితస్మరణానుముక్తి నే కారణమున। ని

చ్ఛగలిగిన ప్రహ్లాదుకొచ్చెముక్తి । కీర్తించిన శుక
యోగి మేటెత్తెంగ। నింతకన్నను వేరొద్ది యిచ్చదీర్ప.

సీ. ఓరాఘవా! నిన్ను నొకసారి పిలిచిన పాపగా
నాకు దయజూపవేమి। నారాయణా నిన్ను నమ్మి భజించిన
నాలుకనయినీవు నాటవేమి। గోవిందనామంబు గోరిపలిం
చిన కోపమ్మా నేజేయుపాపమేమి। భేషజంబునన్ను వె
సనుతింపంగ లేను ప్రేమచేతనె పేరఁ బిలిచినాను । దివ్య
సుందరనామంబు తీపెత్తెంగి। మెరుపుపట్టిన బంగారు మే
రువుంచి। కూర్చితెచ్చినమాలికి జేర్చితేను । బింకమునావి
డి పియమున పరుదొసంగు.

సీ. మోక్షార్థమునకు నే మ్రొక్కవేడితిగాని మో
హంబునను మోము చూడలేదు । సాధుస్వృత్తికమిమ్ము స
న్నుతించితిగాని సంతానవాంఛ చేసల్పలేను । పరమార్థ
మునకు నే బోరయుచుంటినిగాని పామరంబుననతి బరు
వ లేదు। మఱిపెంబుకొ అకు నే ముద్దుజూపంగ లేదు ము
ప్పుగడి పెదరని మురియుచుంటి। జేసనయితిని నేనింకస్ప
ష్టముగను। ఎటులనోర్చెద నేనిటులుర్విలోన। భతల లేకు

న్నబ్రదుకింక వ్యర్థమగును। గానదయతోడ నన్నిష్టుగా వుమాసి యే.

గీ. నీవుస్మృతిలోన నిజముగా నిస్సెలంగి। నీతిమార్గంబు నెప్పుడు ఖ్యాతినొంది। భ్రాతృభావానఁ బెద్దలఁబ్రస్తుతించి। యాతులితంబగు పతిసేవ యవసిలోను,

ఆనందము పాట

ఆనందమానందమాయెను। బ్రహ్మానంద మానంద మాయెను నిత్యానందమానంద మాయను। అద్వైతానందమైనమాయ। తానెందుబోయెను॥ఆ॥

పంచభూతములు నెంచిచూడఁగా ముళ్ళకంచిలో ఆత్మ చేరఁగా। మించిప్రణవముచేత నే ఛేదించఁగా। అద్వైతపొంచిచూడగ జగము మంచివస్తువతానై॥ఆ॥

దేహిదేహములు రెండయినందుకు। మాయకాయమునందు ప్రభవించినందుకు। సోహంభావమునాకు తెలిసినందుకు। అద్వైతస్వానుభావము ఆత్మారాము సేవించఁగలిగె।ఆ॥

పూర్వపుణ్యముచే రాముచూడఁగ ముందుపుట్టుగిట్టు

టలు రెండుపీడగ। జగమువట్టిదని మదికిఁ దోఁచుచుండఁ
గా। అట్టిసృష్టిలోపలమునము పితనాంబనుజూడఁగ ॥ ఆ॥

క. వందనముల నొనరించెద। సందేహము లేసి సకల
సర్వజ్ఞులకుఁ। ముందుగనే నతియిడెదఁ। గ్రంథుగమూ
లంబెఱుంగు ఘనపుణ్యులకుఁ.

క. వాసిగతులనికి ప్రమోక్షతి। చేసినపాపంబులన్ని సి
ధిలంబులుగా। దోసిలిగూరిచి ప్రమోక్షతి। దోసము లేకున్న
యవనిదొరవంచు నొగిఁ

సీ. భాసురప్రక్రియ పసుపుగోల్లుపురాన భూసురుం
డొక్కఁడు పుట్టవలసె। నతనికిసతిగాను ననుకూలవతి యు
గు బ్రహ్మస్వజనమునఁ బబలమయ్యె। దారిద్ర్యదుఃఖాన
దలపోయుచునుమది చెప్పుచునెప్పుడు ముప్పుగడపె। ఇ
ట్టిలోకంబులో నట్టిడితెలియక యప్పుబాధలచేత నపులు
చుండె। జీవకాలంబు థరలోన సిద్ధముయున। గతి సమీ
పించె నంతనే కాలమునను। బంధువులుజూడ పగవాని ప
క్షమయిరి। రక్షకుఁడవీవె రక్షించు రామచంద్ర,

సీ. దీనత్వమునఁ దగ దిడ్డిపూరఁగబోతె యడ్డము వ

చ్చెనీయప్పుబాధ। చెలగి చేతులనుంత క్షితిపఝుబడిపో
వ చెప్పునగొట్టించె నప్పుబాధ। గొప్పయింటనుబుట్టి మె
ప్పుగాబ్రదికినే తిప్పలుబెట్టించునప్పుబాధ। తలిదండ్రులా
దిగ నిగినబంధువులెల్ల తప్పులెంచఁగఁజేయు నప్పుబాధ।
మురిపెంపుబిడ్డలు ముప్పుదీర్చెదమన్న తెప్పునఁజెడగొట్టు
నప్పుబాధ। హరిహరబ్రహ్మాదు లాఁకలిగొనిరాగ నన్నం
బు పెట్టనీదప్పుబాధ। అప్పుబాధను భరియింప హరునితరమ। గొప్పకోరింతపాదగాదె కొమరుమిగులు। అన్నమనితినపెద్దలీయవనిలోను। నున్నమగు నప్పుబాధచే నెన్ని
చూడ.

క. ఏకరణినప్పులేమియు। నాకలియని యడుగకున్న నంబుజనాభా। చేకొని సకలవ్యాధులు। ప్రాకటముననం తకంత ప్రబలంబౌ యోకా.

సీ. నాటెవారాసంగతుల్ నయముగాఁ దెల్పంగ నాటకంబులుగదా నూటియగును। నాటకంబెట్టిదో నాటెంబెఝుంగక బూటకంబందురు భువినిజనులు। తనమోము దర్పణంబున జూడనయ్యేడు మనువునుదగు నీతి మానవు

లను. శత్రుకోటిపయిన శపన లేకున్నట్లు వృత్తినిడగు నీతి వెలయవలెను. ఎట్టివారికి నాటకమెఱుఁగ లేక దిట్టముగ బోధవినుటకు దీనగలుగు. వట్టిమాటలచేతనే వదరుచుం డు. పామరులు మాడ ద్రృశ్యకుబంధమరయ.

క. అబ్బురమగు వారికృపచే । కబ్బంబులు జేయుచుం ను కవిజనులిపుడుఁ । నిబ్బరముగవిని నీతులు । దబ్బరము లులేక యెపుడు ధన్యులుగాఁగ.

వేడుకపాటలు.

(తెలుపుతియ్యావే భామా—అను మెట్టు)

పల్లవి. అగరు చల్లుదాము రారే। అతివరో స్వామి ప యిన। అగరుచల్లుదాము రారే।

అనుపల్లవి. అగరుచల్లుదము రారే, బిరబిర మనసుని లిపి। మాయనువెడబాసి మనసునిలుకడ జేసి॥అ॥

ఈషణత్రయములను విడచినాడో యమ్మ । మోహ పాశములను మొదటనే లేదోయమ్మ॥ అ॥

అతలపితలసుతల పాశాశముల లేదు। సతతముతనతో చూడు। స్వామితానై నాడు॥అ॥

షట్చక్రములపైన సాక్షిభూతుండో యన్నా। పంచము
ద్దలవిడచి। ధ్యానము తెలియవేకొమ్మ॥అ॥

చిత్తమొక ధిక్కనంజేర్చి చిద్ఘనలరామకృష్ణయ్యగా
రి పాదాబ్జములకు కరుణతోడుతమనసు॥అ॥

చెలియరో వినవే శ్రీ శాస్త్రదృష్టమున కాదు।. ఊహ
మూలముదీని నాహము నణచవలెను॥అ॥

గంధపుపాట.

పల్లవి. గంధము లందానురావే.

అనుపల్లవి. హృత్కమలములో వం। కలకంఠరాణి।
ఓకల కంఠరాణి॥గంధము॥

స్వచ్ఛపుకంకుమ। శోభిలుపసుపుతో। సోహం భావ
మనే నీమనుచేత। అనీమాము చేత॥గంధ॥

కామక్రోధంబులం గలిసి యరుగడలను। అమనస్క
భావమున అత్తరుగలిపి॥గంధ॥

ఈషణత్రయముల వాసించు పరిమళం పరిపూర్ణ
భావమున పన్నీరుగలిపి॥గంధ॥

స్వచ్ఛముగా విన్నడి సోమయాజులపుత్రి। సీతమ్మచేత

ను శృంగారకృతులు॥గంధ॥

(ప్రాణేశాయ విరులబంతి-అనుమెట్టు)

తల్లినిన్నునమ్మినేను ధన్యురాలనయితినో నాతల్లి నిను నమ్మి॥ అనుపల్లవి. ధరణిలోనీకీర్తి వెలయు। దయజూడు నను వేగమే॥త॥

సూటిగాశృంగేరిపుర। పీఠమునవుంటివే। ధాటిగాప్ప ధులపేటకు శేపీ। పాటికిదయచేయవే॥త॥

చిన్ననాటినుండినిన్ను సన్నుతించినాడను। విన్నపము లాలకించి। నావిన్నపములాలకించి విశదముగనుబ్రోవవే॥

చక్కగానాతల్లి నాక్లేశమనివారణచేయవే। మాతా వనుచు పూజచేతునా। భారతానుదయచేయవే॥త॥

దేహమశాశ్వతమాయె। క్షణభంగురమెకాక। చెప్ప దమాతల్లి దండ్రిముప్పుగడుపవలెనేని॥త॥

చెప్పదవినరమ్మమీాకు। శ్రవణానందముగను। చెలి యరో శతావధాని శారదప్రసాదము॥త॥

ధైర్యమిచ్చి కావవే। మాతల్లిమాకు ధైర్యమిచ్చి॥ కా॥

ధైర్యమిచ్చి కావుమని। తల్లిశరణుజొచ్చితి। ఆపదలను

బాపిమాకు అభయమిచ్చి కావవే॥ధై॥

చిత్తమునను మతినినిన్ను। భక్తిగానునమ్మితి। ఉత్త
మాటకామనను। నత్తుకొనుచుగావవే॥ధై॥

సతతమునా మతినినిన్ను చక్కగానునమ్మితి। నాసుతు
డయినకృష్ణమూర్తికి వెతలుదీర్చిబ్రోవవే॥ధై॥

తల్లినిను నెరనమ్మినానె॥నాతల్లినిను నెరనమ్మినానె॥

వాసిగనునీకునే వందనముచేసెదను। గాసి లేకుండ న
ను కాచిరక్షించుమని॥త॥

ఇమ్మహిలో నమ్మాయమ్మ తల్లివై నీవుండగ। కొల్లగ
ను పిల్లలకు నుల్లాసములీయుమని॥త॥

నిక్కముగ మక్కువతో దిక్కునీవనినమ్మితి। గక్కు
ననుకచ్చేరిలో ఘనలక్ష్మివై కావవె॥త॥

సాంపుమీఅ సోమయాజిపుత్రిక। ఇమ్మహిలో చిత్త
మునసీతమ్మకు ఆపదలుబాపుమని॥త॥

(దేవదేవబ్రోవవే మము-అనుమెట్టు)

తులసినిన్ను జూచినిన్ను ధూమశకటంబైతినె। ప్రక
టితంబుగ వేడితినినే। వికటమెందుకు తెల్పవే॥తు॥

మొ్రొక్కి నిలిచినవారికి । నీవు మోక్షమిచ్చే తల్లివి । పి
క్కకోరికలేమనాకు నొక్కకోరికతీర్చవె॥తు॥

సన్నజాజిపూలచేతను చక్కగాపూజింతునె । సృష్టి
లో శ్రీరామశాస్త్రికి చిరంజీవులనియ్యవే॥తు॥

మృదుమధుర వాక్యములచే ముఖ్యముగఁ బ్రార్థింతు
నే। బాలురకొఱకై నీకొక బాగుగవినిపింతునే । పసిబా
లురకొఱకయి నీకొక బాగుగవినిపింతునే॥తు॥

వాటముగపేటలకు నీసాటియెవ్వరులేరిక । ధాటిగపృ
థులాంబపేటకు రాటుగానినుఁ జేసెద॥తు॥

సుదతివినవెనాదు సుఖములను జెప్పెదను। నమ్మికల
తోఁ జనె నన్నురక్షించు॥సు॥

ఆధారమున మొదలు। ఆరుచక్రములను పూజలను జే
సి। యాపుత్రినిగనగంటి॥సు॥

జ్ఞానమనపుత్రి జ్ఞేయంబునెఱుఁగక। జ్ఞానహీనము చే
త దేహినేనయితి॥సు॥

సాటిభూములలోను మేటిగుహలోనీవు । ధాటిగనీవు

నన్ను దరిజేర్చవలెను ॥సు॥
సోహంమనేకీలు స్వచ్ఛంబుగాదెలిసి । సోమయాజిని జూచి సొంపలరుచుండి॥సు॥

ఎటుజూచిబ్రహ్మ మేనూని దెల్పెదు । యేమహ్మానరిగితె వో మనస। సతతముతనలో యీస్వామిధ్యానమె కాని యితరచింత లేలనె మనసా॥యె॥

ఆధారమున మొదలు ఆనందమును బొంది। ఆశలేదు కొనవద్దెమనసా। వాసిగతనలోన నీశుధ్యానము చేసి । సోపరహితంబావె మనసా॥యె॥

ఏడుమేడలమీద నీకాక్షరములో వెలుగు । కనవలెనె ఓమనసా। యెఱిగినగురుబోధ తిరిగిరాదని నీవు । స్థిరమతి నొందవే మనసా॥యె॥

పట్టువిడువకనీవు బ్రహ్మంబుతో జెంది । భ్రమవిడువవలెనె ఓమనసా। గుట్టుతెలిసిగాని గురుని పాదములు గట్టిగామదినిల్పెమనసా॥యె॥

శివమంత్రబలముచే చీకట్లనుబోవు । నేకమైయుం

డనోపునసా। సృష్టిలోపల నేను సీతమ్మనుచూడ అపదేల్ల
నుబాసెమనసా॥ యొ॥

సోహాసోహంగంటిగదా। నేస్వల్పముగా నిను గంటి
గదా॥ సో॥

ఉచ్ఛనీచములు లేవుకదా । ఇక నిశ్చయముగనీ వేను
కదా॥ సో॥

కుండలాగ్రవాని యుంటిగదా । నేకుడి యెడములతో
నుంటిగదా॥సో॥

నాడికిమధ్యనెయుంటిగదా । నేనాద బ్రహ్మము వింటి
గదా॥ సో॥

నిర్గుణభావము నిజముగఁదెలిసితె। నీలో బ్రహ్మమునీ
వగురా॥

పన్నుగపది రెండక్షరములలో। బాగుగదెలిసిన బ్రహ్మ
మురా॥ సి॥

కంటికిమింటికి రెంటికి జంటగ । కాంతికి వేరై యుండ
దురా। రెంటికిరెంటికి జంటగ వెంటనె వెలిగేజ్యోతినిజా

చెదబ్రహ్మమురా॥ని॥

చక్షులనడుమను నిక్షేపముగను । చెలగుచునుండే బ్రహ్మమురా॥ చెలగుచునుండే బ్రహ్మముజూచితె। శంకరకవియగారా॥ ని॥

కుండలిస్థానంబది లేటప్పుడు కుదురుగనొక్కట్టి నిల్పవలెన్ । విలిచినప్పుడే నిజముగజూచితె నీలో బ్రహ్మమునీవవురా॥ని॥

ఏదారిజూచిన గోదావరికదా । నీదారి దొరకదురా। కర్మఫలములయందు కాంతచేయకనే నీనమ్మికతోనుంటిరా। నమ్మినవారికి సామ్మునీవేతప్ప । ఇమ్మహిలో ఫలసంకల్పమింతయు లేదు॥ఏ॥

సారములేని సంసారములో జిక్కి । వాలలాడుచు నుంటిరా। నేరమని యెంచక । భారమనుకొక । భేదములేనినీదారిజూపవలెరా॥ ఏ॥

ఫాలభాగమునందు। లీలాజ్యోతులనందు। ఫాలలాడుచునుంటివి। నీలతోయదమధ్య। నీవారశూకమున। నిన్ను

గలియక నేనీ। నిమిష మోర్వఁగ లేను॥ ఏ॥

ఇలమనుజజన్మము ఇచ్చెలన్నియు రోసి । నిశ్చయము గనుంటిరి। స్వేచ్ఛముగవినుఁడి। సోమయాజులపుత్రి। వచ్చే జన్మములోకి ఓర్వఁగజాలదు॥ఏ॥

హనుమంత దయరాదా। ననుబ్రోచుటకును॥హ॥

వాయుసుతుఁడవని వందనమిడితిని దేశికులకునే దాసుఁడనై తిని॥హ॥

రాక్షసహారివని దీక్షతోఁగొలిచితి । ఈ క్షణమందున కటాక్షించెదవని॥హ॥

శంక లేకనులంకచుట్టుగను । వింతగ దూకిన గంతుల స్వామివి॥హ॥

సీతకు చిటికెనవ్రేలియుంగరము । ప్రీతిగనిచ్చిన కోతివిగదనీవు॥హ॥

చింతలుదీరగ సిరులనునొసఁగుచు। చివుకులకృష్ణయ్యా చిరంజీవులుగను॥హ॥

(నారాయణ నీనామము పారాయణ-అనుమెట్టు)

రారవీరహనుమంత రక్షింపగతడవేలర । పాదవారి
గుచునిను। పలుమారుగ వేడెదను॥ రా॥

దీనజనులకు వేరెదిక్కెవరుహనుమంత । నమ్మియున్న
వారలకు సామ్మునీ వెహనుమంత॥ రా॥

అక్షీణపుణ్యపురుషుఁడవనుచునిను తలచితి। భిక్షుకునిపయి
నింత కక్షయేలహనుమంత॥ రా॥

వాసిగనుసన్నిధికి వాలాయంబగుచు । నీవారలను
బ్రోచుటకు వాదేలగహనుమంత॥ రా॥

(ఇఁకనయిన పెండ్లాడవలెరా-అనుమెట్టు)

రాజశేఖరవేగరార రక్షించుటకు వేగరక్షసంహార॥

చిన్నవయసుకు మంచియున్నతమెఱుఁగడు। పన్నగశ
యనీవు పాలించవేర। నీవుపాలించవేర॥ రా॥

వాసిగక్లాసులు ఒప్పుచున్నవిగాని । కాసైనచేయదు
కాపురమిలలో। అరకాసయినచేయదు కాపురమిలలో॥

ఆశచేతనేనీ దోసిలొగ్గితిగాని। హనుమంత నన్నుబ్రోవ
బలవంతమటర॥ రా॥

సమ్మతిసవృద్ధివిద్యార్థులకెల్ల। సిరులిచ్చి రక్షించ నీ తరమే లేరా॥రా॥

(ఉంజిలిలాలి మెట్టు)

లాలియోగవేమయా। రామజోగిసోమయ। పడతు లంతగూములుగూడి పాటపాడెదరయా॥ లా॥

కర్మఫలము చేతనీకి। కాయమా యెనేమయా। జన్మసం చితములుతీరె। జాతమింక లేదయా॥లా॥

మంచిమంచితత్వములను। మంచమమరియున్న దయా పంచరంగుల నెడిమంచి పరుపులమరియున్నవయా॥ లా॥

అండపిండ మనెడు రెండు దిం డ్లమరి యున్నవయా। నిండియున్నబయలులోను। పండు వెన్నె లేమయా॥లా॥

కృష్ణలీల

ఓ యశోద యేమి చేయుదు మే। ఈలాటిదుడుకుల। ఓ యశోద యేమి చేయుదు మే॥

చిన్న తనయుడుకన్నెపిల్లల। కౌగిలించెను కియ్యమా డెను। వన్నెలెంచిబల్ వరుసలాడు చును। వేళ్ళజూపుచు గోళ్ళగిల్లెను॥ఓ॥

కొ౹ త్తకోడలు అత్త చాటున । తత్తరింపుచు దాగి యుండగ। తత్తరినడకలతనయుడు వేగమె । కనులెత్తిచూచినయలో త్తిపో మొనిటు॥ఓ॥

అమ్మరో నేనమ్మనంటిన సమ్మగననుచంక బెట్టెను। చంకనుండకనుజారినూకితే । పంకజాక్షి పాలింప్లుదాకెనిటు। ఓసితల్లిరో మోసపోతిని। అమ్మరో నే ఓసి తల్లిరో నే మోసపోతిని॥ ఓ॥

ఆటలాడేబోటిలిండ్లలో। పాటిచేయను చాటునైనను। ఉత్తదనుచు నాచిత్తము పల అత్తలుగన్న ఈఉత్తమ స్త్రీని। ఓసితల్లిరో మోసపోతిని॥

గోదావరీనదీపుష్కరము.

కొ౹ వ్వవినవే గోదావరి మహిమ దెల్పెదను । నమ్మిన వారికిదీన। సమ్మతిగలుగు॥కొ॥

పదియు రెండువత్సరములు బాగుగా దెలిపి పూని రెండు యేకమయితె పుష్కరమహిమ॥కొ॥

ఇళపింగళనాడినాళమునందు పూని భ్రూమధ్యమందు పుష్కరమహిమ॥కొ॥

పన్నుగానీపరుషఁజూడ పంకజాగ్రయుండు ధాత్రిలో
చూడఁగనీనేత్రోత్సవముకొఱకు॥కొ॥

పూలచెండ్లపాట.

(బంతులాడరావె బాలికామణిరో-అనుమెట్టు)

చెండ్లనాడరార చెలియతోడఁగూడి। బొందుమల్లెపూ
లదండ చేతబూని॥చెం॥

ఆధారమునిచేతు అక్షరముల గూడి। యుక్తిసహిత
ముగానీవు శక్తి గణపతితో॥చెం॥

స్వాధిష్టాన ఆరుదళములను। గూడిపేరుగలిగి నీవుబ్ర
హ్మసారస్వతితో॥చెం॥

మణిపూరకమున దశదళములగూడి। లక్షణ మెంచు
చు లక్ష్మితోడఁగూడి॥చెం॥

(ఎవరమ్మామీరు-అనుమెట్టు)

చెండ్లాడవమ్మ చెలువునిగూడి చెండ్లాడవమ్మ॥

చెండ్లాడవమ్మ నీచెలువునితోఁగూడి। చేరిభ్రూమధ్య

మున చూడవేడుకయిన చెండ్లాడవమ్మ॥

స్థూలసూక్ష్మముల కారణములకతీతముగను। నీలతో యదమధ్య నీవారశూకమున । నిలిచిసోహంబనేయగని పూలబంతి॥ చెం॥

దశవిధనాదం దర్పణమునసిలి చి। నీవుచూడు పరమ హంసోహమై। పరతత్వ ఓంకార ప్రణవనాదమువినుచు। బ ట్టబయిటనునిలి చి॥ చెం॥

కుడియెడమలకును కూడియుండు మేడలోపలను। నా డులోపలనున్న మూడు మేరులుదాటి । నాసాగ్ర వీధిలో నాణెమైనపూల॥ చెం॥

(అమ్మాశివుకొమ్మ- అనుమెట్టు)

తల్లీకల్పవల్లి నను దయనుజూడుతల్లి। పంతమేలనమ్మ నీ బంటుదాననమ్మ । సద్దుచేయకమ్మానీవద్ద దాసినమ్మా॥

ఆశకొలదినేనీ దోసిలొగ్గితమ్మా। మోసముంచకమ్మ నాయాసదీర్చవమ్మ॥

వింతలేలనమ్మా విశ్వేశ్వరునికొమ్మా। ప్రేమతప్పక నీవు ప్రాపుచేయవమ్మ॥

భాసురమ్ముగానే పసుపుగొల్లుపుర। నివాసుఁడ నను చుమదిని వాసినెంచవమ్మా॥

---

మహారాజశ్రీ శ్రీరాజా మంత్రిప్రగడ భుజంగరావు బహద్దరు జమీందారుగారి పుత్త్రిక చి సౌ. హైమవతి పరిణయ మహోత్సవ సమయమునఁ జదువఁబడిన పద్యములు.

గీ. మహినిబెక్కురఁ గంటిరీ మనుజవిభుని
బోలువారలునుఱె మఱి పుత్త్రియైన
హైమవతిఁబోలు వనితలీయవనియందు
నున్నవారలె ముదముగుఁ జిన్నమాంబ.

ఆ. పేరుచిన్నబాంబ పెద్దయైవెలుగొందు
కొద్దివారినెల్ల గొప్పసేయు

మెప్పుకోలుకు గాదు మేరుశిఖరమున
నొప్పుచున్న దీమహోత్సవంబు.

ఆ. అన్నదానమునకు నధికమైనది లేదు
చిన్నమాంబకన్న స్త్రీలు లేరు
వసుధవిద్యకన్న వైకుంఠమున్న దే
తల్లిదండ్రికన్న ధరణినరయ.

సీ. కరిమీఁద నున్న యాఘనతేజమును జూచి హరి
యటంచు నుబల్కి రవనిజనులు। శివుని విల్లువిరచి సీత బెం
డ్లాడిన హరియంచుఁ బలికిరి యవనిజనులు। నిర్మలచిత్తు
లై నిలిచిచూడఁగఁ బోవ సత్యనారాయణసంజ్ఞ దనరె। అ
తని చేరువనున్న హైమవతింజూచి పొందు గాజనుల కానం
దమయ్యె। వడ్లమన్నాటి వంశసంభవుఁడునగుచు। మం
త్రిపెగ్గడవారి హైమవతిఁ బెండ్లి। యాడి యైశ్వర్యవంతుఁడై
యులరు నీతఁ। డంచు నార్యులు వచియించి రవనియందు.



సీ. వసుధలో జన్మంబు వచ్చినప్పటినుండి సుఖమునొందఁగ లేదు సూక్ష్మముగను। కాయమే మాయని కలిననుల్లరియించి కమలనాభుని సేవఁ గాంచుచుంటి। దైవస్వరూపాన ధరణిలో జన్మించె తండ్రి సోమయాజి తపముచేత। తల్లిసోమిదేవికి తనయులునిరువురు వంశరత్నంబులై వరలినారు। తొలిజన్మముననుండి తొలఁగ సంచితమును నోఁబుట్టుగానట్టి దోఁచెజగము। తప్పులెన్నఁగరాదయా ధరణిలోన। నోర్పుగలిగినవారై కుంత మొందఁగలరు। బ్రహ్మవిద్యను గనుమంచుఁ బ్రస్తుతింతు। వ్యర్థపుచ్చెదు కాలంబు సార్థకముగ.

## మంగళారతి.

(పాలకడలిశయనరార– అను మెట్టు)

ఆరతిదుగో అంబుజోదర। ఆగామి దీరిన యారతిదుగో అంబుజోదర॥

ఆరతిదుగో అంబుజోదర అవనిరూపమై వెలసినస్వానుభవముచేతనీకిది। చక్కనయిన దివ్యమంగళ॥ఆ॥

పంచేంద్రియములను పశ్యైరముగఁ జేసినేను । మించి ప్రణవజ్యోతితోను । సంచితంబనేటిచమురుతో ॥ఆ॥

దిక్కులన్నీ పిక్కటిల్లగా । నెక్కడజూచిన నొక్కరూపమై వెలుఁగఁగా। చక్కఁగా తనతోనుజూచిన। పండువెన్నెలనిండుకళతో ॥ఆ॥

అండరూపమైయుండఁగా బ్రహ్మాండమంత అఖండరూపమయియుండఁగా। ఎండమావులవంటికాయమునం డవదలకయుండదంతట॥ఆ॥

సోమసూర్యమధ్యనుంటిగా । సోహమనేటి కీలుదెలిసి మేలుగంటిగ। చిత్తమునుబహుపొత్తుపరచిన సీతమూంబకు॥ఆ॥

## మంగళారతి.

(మునీంద్రదనీవెవరో–అను మెట్టు)

ఆరతిగైకొనుమా మంగళ ఆరతిగైకొనుమా। దశరథాత్మజుని దలచితీమనమున అసుర సంహారుఁడ। ఆనందింపుమా॥ఆ॥

రాతినాతిగను ఖ్యాతిగనుజేసిన। నిలవరునికి నిత్యమంగళం॥అ॥

తాను తమ్ములను తనయులతోడను। అతివలతోడను అయోధ్యకుఁజనుచును॥అ॥

కుడియెడమలకును కుదురుగనడిచిన। కూడి ఆశికుశలవులతో॥అ॥

భాసురమ్ముగను పసుగోల్లుపురని। వాసినివ్వ దయని వాసుడునను చును॥అ॥

## అమ్మవారి పాట.

బహువిధములనిను ప్రార్థించెదనే భవానీ। ఎన్ని జన్మములెత్తితిగాని నేఁబట్టిదానని యింగితమెఱుఁగను॥ భవాని॥

నిద్రమబ్బుననిను నీచములాడితి। ఆగ్రహముంచక శీఘ్రమెబ్రోవు॥భ॥

బాగుమీరనాబలగములోపల। శాంతిభేదములనిభ్రాంతినిచ్చు॥భ॥

పృథివిలోపలను పూర్ణ గ్రామములో। నాపుత్రికయౌ
న్నది రక్తితోడఁ బోవుదు॥భ॥

---

## యజ్ఞపుపాట.

ఈయజ్ఞవేదికలు। ఈయజ్ఞశాల యీయజ్ఞమీస్థలియు
కెంతయొప్పినది. శ్రీగణనాయకుని చిత్తాననిలిపి। శ్రీగురు
శ్రీనివాసస్వామి గొలతు। యీసరసులెల్లను మతిని సంత
సించగను। సురభియజ్ఞపుపాట సరణిఁబాడెదను। ఈ॥ సా
రమింతయు లేని సంసార ఘోర। వారాశి దాటుటకు వా
డయజ్ఞములు। ఈ॥ తపముగా దేతల్లి తమ్మిచూలికివి। సెప
మాయె యీజగము నిర్మించుటకును।ఈ॥ మూడువర్ణ
ములవారు మనువుచేయుదురు। నీయరగంధ కాని నిజక
ర్మములను।ఈ॥ వీరికందరివల్ల విచితకర్మమునను । వేరువే
రుని వేదవిహితమైయుండు। ఈ॥ అవనీసురులుతపములు ఆ
దుకర్మములు। అవి కాదు యజనాదులనిబుధులండ్రు। ఈ॥
చిత్తముశోధించిసిద్ధించుటకును సత్తయిన యాగమని స
కలనిశ్చయము। ఈ॥ ముగ్గురుతనకయిన మునుపయిన వా

రు జగ్గునజన్నంబు సేయకుండెం। ఈ॥ సాంమ్రాజ్యమెంత యినసమకూడియున్న। దాఁబ్రాహ్మణుండనే దోషమెన్న డును। ఈ॥ సర్వజ్ఞులయినట్టి సహ్యాములకెల్ల ఉర్వింయోయా గములు నొప్పగావలసి। ఈ॥ అన్నదానము లేక అహుతి లేక పన్నుగాదక్షణలు పరగనిచ్చెదరు। ఈ॥ మంత్రతం త్రములును మన్నన లేక తంత్రమే యీయజ్ఞము తనుజం పుటకును। ఈ॥ ఈమహామహులెల్ల నేర్పడవినంగ సోమ మార్గసమృద్ధి సొంపువర్ణింతు। ఈ॥ శేషాచలోత్తర ప్రాంతంబునందు నిశ్శేషసుగుణములు నిలయమై యొ ప్పు। ఈ॥ ఇట్లిటువర్ణింప నెవ్వరివశము మట్లవెంకట్రామ మహీపతిసీమ। ఈ॥ అక్కడశిరిఘోట పట్టైననెలవు చక్క ని కిచ్చమాంబాపురముగలదు। ఈ॥ భార్గవ బాహుదా నదుల తీరమున మార్గమై స్వర్గాపవర్గాదులకును। ఈ॥ అందగగణ్యులై యిందుంగలరు ఇందుశేఖరులై నయకులకెక్కు। ఈ॥ క్రశమంబుతో వారు సలుపుచుం డెదరు దశపుయేకాదశీ ద్వాదశీవ్రతము। ఈ॥ ధ్యానావ ధారులై బహుచిత్తమునను మానప్రపూజలు భక్తి చే

యముగ। ఈ॥ మసలకెప్పుడు వేద మంత్రఘోషణము వ
సుమతి సురలిండ్ల వెలయుచునుండు। ఈ॥ ఎల్లకాలంబచ
టనిష్టిపశువులను కొల్లలుగ సోమయాగములు కలిగియుం
డు। ఈ॥ వారువేల్చెటి యజ్ఞవిభవమంతయును వివరించి ప
ల్కఁదా వినఁడివేడ్కలా। ఈ॥ వేదోచితంబయిన యుచిత
యజ్ఞములు మొదటనే ఆధాన మని మునులండ్రు। ఈ॥
హోమపూర్వకమిష్టి పూర్వకంబనియు సామపూర్వకమ
నే సొంపలరుచుండె ఈ॥ సోమయాగము చాయ పోయే
టివమును పు సోమపూర్వకమంత్ర సోమజ్ఞులెల్ల। ఈ॥ అటు
వంటి యాధాన మమరంగఁ జేసి కడువెన్క యజ్ఞసంకల్ప
ముఁదీర్చి। ఈ॥ వయసతో సోమప్రవాకాదులయిన వర గు
ణాఢ్యులు వేదవిధులమరించి। ఈ॥ బుధులకు పదహారు
భూమిదేవులకు మధుపర్క పూజతో మన్ననలుచేసి। ఈ॥
దక్షిణాయనర్ప దీటుమీరగను వీక్షించకనీలవేణి వేడుక
ల। ఈ॥ దక్షించినట్టియా దీర్ఘదర్శనుండు సాక్షాత్కరిం
చిన సారసాక్షుండె। ఈ॥ అజినముదాల్చిన యతిపుణ్యుఁడి
తఁడు ఉచిత కాముండయిన విధిశేఖరుండు। ఈ॥ జింకకొ

మ్మున్ధరించి చెలువుమీరఁగను పంకజాసనయితఁడు పద్మా
సనుండె। ఈ॥ దీక్షితులు అయిన యీ దంపతులఁ జూడ
దాక్షాయణీశూల తలపకేమిటికే। ఈ॥ మొన్నికమీాటి
నాయన్ని సుకృతముల పన్నా నాశుభదీక్ష పరగనీతనికి। ఈ॥
కడుపారఁగనీతనిఁ గన్నట్టితల్లి కడు నెన్నిపూజలు శాంతు జే
సినదో। ఈ॥ చాలభాగ్యవతమ్మ చానయీ కొమ్మ చెవుల
గట్టెను నితని జెట్టబట్టగను। ఈ॥ అనిజనులందఱు నభినుతి
సేయ పెనుచు ప్రాగ్వంశంబు వేడుకజెంది। ఈ॥ అయిదు
దేవతలకై యతిభక్తితోడ ప్రాఘుణీ యాదులు బాగు
గాఁజేసె। ఈ॥ పస్తోతసామమునఁ బస్తుతి సేయ నూతన
ముగకర్మ నితహోతసేయ। ఈ॥ గంగ యేహి యటంచుఁ
కర్మవాసనతో గంగవంటికర్మ గోవులనుబిలిచి। ఈ॥ పూ
జించిపిలికిన పుణ్యాకర్మములు సుజనులందఱు గూడి సురు
చిరమనుచు। ఈ॥ అధ్వర్యుడాశ్రావయనివినగానె అగ్నీ
ద్రౌడు అస్తుశ్రౌషటు అనిపల్కరింప। ఈ॥ విశ్రాంతులై
నట్టి వైదికులెల్ల శ్రావ్యమునహోత వౌషట్టు అనిచర్చిం
ప। ఈ॥ తొల్లికాలంబున తోయజనేత్రి ముల్లోకములఁ

గూడి సుఖమొనరింప। ఈ॥ పుడమి నాయజ్ఞపురుషునిసర ము పుడమిప్రవర్గేష్యాయమిా బుధులుపల్కుదురు। ఈ॥ సో మవేదికరచియించి క్షేమముననగ్ని సోమియ్య పశుయాగ సుప్రయాగములు। ఈ॥ పుపుబోడి యీమేకపోతు పూర్వ మున తాబో్ఁ తీర్థక్షేములఁ దపముచేసినదో। ఈ॥ పల్ల వాధరదీసిపాలించినట్టి గొలడస్వర్గము కొల్లలాడెగదె। ఈ॥ ఏపుందమేసెనో యీమేకపోతు ఆమందమేకలా యే మంకుమందు। ఈ॥ శ్యామలంగనంగహోమము చూడ ది నము సాయమా యెనుశదే సామజయాన। ఈ॥ సోమం బుదంచవలె సుదతిరోరాత్రి సమయమున నింటికి చనివె ళ్ళుదామ। ఈ॥ గోరంటచేతులా కోమలి యునిచి పేరం టమని పెద్దవారినిపిలుతామా। ఈ॥ పసుపుకుంకుమ దెచ్చి పడతులందఱికి కుసుమములువిడెములు గొబ్బునిద్దామా ఈ॥ ముత్తయిదులుమనము ముదము మిాఱగను। యో త్రిపాడుచుదంచె యేర్పఱుదామా। ఈ॥ ఎంతపుణ్యము జేసె నీమేకపోతు ఈయూపస్తంభాన నిది కట్టువమును। ఈ॥ సువ్విసురనాయకా సురగణసేవ్య। సువ్వి సుమనత్ర

యా సంపూజనీయ। ఈ॥ సువిస్వాహాసుదాసుదదివ్యభా వ్య సువ్విచతుర్వేదనిలయ సువ్వియనుచు। ఈ॥ యజ్ఞపు రుషునిపేరు మెత్తిపాడుచున తరుణిరో సోమంబు దంచ గానలెను। ఈ॥ అమరికిసోమతాచదు దెంచినట్టి సవరణ జె ప్పెదాం చక్కగా వినుండి। ఈ అమరాసురలు గూడి యుం బుధిదరువ అమృతంబుకోయి సోముడవ్వ డెపుట్టె। ఈ॥ పు ట్టగా నేచూడ కట్టంబుగట్టి పట్టుదా నోపధుల పాలెంబు మనిరి। ఈ॥ రాజువలెనోపధులు రక్షింపుసోమ రాజను పే రటరంజిల్లుచుండె। ఈ॥ క్రదున స్తుకణులు కద్యముసే య క్రమవతాగెలిచి గాయత్రి కనియె। ఈ॥ భాసురం బ యినసోమంబు భూసురంబునిలుప। దాసురాం యినమీా తల్లిఁవిడతు। ఈ॥ అనవినిగాయత్రి అజుతోడ గెలిచి చ నుదివ్యలోకులాచలమమరినట్టి। ఈ॥ మూాడుదినములు మూ రువునుండ ముదితయుందలగారె మూాడు రాత్రిళ్ళు। ఈ॥ క్రయమయినపిదపను గోష్యంబుచేసి। దయమీాంద దాచె దరు ధరణిదేవతలు। ఈ॥ వేల్పాలంతట దలచి వెలదులు గోరు నార్యులుగంధర్వ వేడదలచె। ఈ॥ వాణిని గోవుగా

నోసరభాషించి వాణినీకిచ్చిన వాఁడు సోమమటుయిచ్చె।
ఈ॥ అవనియందునుగాదె యధికసోమమును సోవు దక్షు
ఁజేసికొనుల్వేనుచూడు। ఈ॥ యీరీతిపుడమినివీ సోమయా
జి న రీశిరోమణి నలుదిశలనెగడె। ఈ॥ సోమసంభవమెద
ట సుదతిపూదశేను సోమయాగములౌను సోమ్యంబు వ
లెను। ఈ॥ అధిపలేకున్నను ఆధారమవును పదపద విధిలే
ని ఫాల్గుణమవును। ఈ॥ రాము చూడు మహో రాత్రిప్ర
యోగ రామణీయులై యిచటరంజిల్లుకరణి। ఈ॥ పాత్రర
నువాకంబు పరిస్తుతించినను నీతిపై పవనీయ నిర్వాక మ
గును। ఈ॥ మతిమంతులందఱు మన్నన సేయ ప్రతిలేని
యీబహిష్పవమాన మొప్పు। ఈ॥ సమనీయపశువును చ
క్కగా తెచ్చి। ఆహవనీయము వేల్చెదు అగ్నిహోత్రున
కు। ఈ॥ ఐందరివాయువ్యాదు లయిన గ్రహములను సాం
దిముగాఁజూడ సరసీరుహాక్షి। ఈ॥ అద్యాదిసప్తప్రవాకుల
తిబుద్ధిహోత పూజ్యులందఱువినగ బూని సమసింప। ఈ॥
ఇదుగు ధామదేవ యువజనవినవె అచటశివసామోద యి
వజనవినుమ। ఈ॥ ముదిత వినవేమి దామోదరై వి యునఁగ

యిదుగోదాముదే వయివజనమువినుమ। ఈ|| వీరినిజూడక
వైశ్వదేవాగ్ని మరుశస్త్రములు మణి మంటపమ్ములకు।
ఈ|| మహితపాత్రసమసమమరిందతోలత్తో శీతమూద్యం
దినసమకంబులోడ। ఈ|| సాయమందుతృతీయ సమయము
లుమూఁడు నెయ్యి వేసమనీయ నిఖిలయాగములు। ఈ||అ
వబృథయిష్టి చేయించి హర్షణంబుమీఱ పామరవర్ణనం
పరగఁజేయుదురు। ఈ|| అవబృథస్నానంబు ఆచరించినను
అవనిలోఁబాపముల నప్పుడేబాపు। యీపాటపాడిననింత
కునెల్ల ఆపదలెల్లను అప్పుడు తొలగుండు। నీ యజ్ఞవేదు
లు నీయజ్ఞశాల ఈయజ్ఞమీచెలియ కెంత యొప్పినది॥

ముక్తిమార్గోపదేశిని

సంపూర్ణము.



# కవినాథ విలాసములో వెలకు

## దొరకు గ్రంథములు.



| | | | |
|---|---|---|---|
| క్రొత్తకోడలు | 0-0-6 | హరిశ్చంద్రీ నె ౨ రు | 0- |
| మనతికము | 0-0-6 | శకుంతల | 0- |
| దొంగకంగడు | 0-0-6 | నలచరిత్ర | 0- |
| చుట్టపొడుము సంవాదము | 0-0-6 | సావిత్రిచరిత్ర | 0- |
| వీరస్త్రీలు | 0-0-6 | జ్ఞానవతీవిలాసము | 0-0- |
| తిక్కశంకరయ్య | 0-0-6 | రామలక్ష్మణదేశయాత్ర | 0-1- |
| సత్యవాక్యము | 0-0-6 | ముక్తిమార్గోపదేశిని | 0-1- |
| శాంత | 0-0-6 | హరిశ్చంద్రకథ (పాట) | 0-1- |
| అశ్వగామి మశ్వపునీతులు | 0-1-6 | ఆంజనేయదండకము | 0-1- |
| ఆర్యకథానిధి నె ౧ రు | 0-2-6 | జామితగంధుకథ | 0-1- |

ఇంకను అనేకపుస్తకములుగలవు. కావలసినవారికి—

గ్రంథములజాబితా ఉచితముగా బంపబడును.

వలయువారు,

## మేనేజర్, కవినాథవిలాసము

ఏలూరు, కృష్ణాజిల్లా,

అని వ్రాసికొనవలయును.

